శ్రీరం.



# శ్రీ రామ శతకము.

ఇయ్యాది
శోత్రియం తిమ్మాపురం
హిందూ ఎలిమెంటరీ పాఠశాల,
ప్రధానోపాధ్యాయులగు,
బి. నారాయణగారిచే రచింపబడి,
వారి గురువగు,
టి. వెంకటాచలపతిరాజు గారిచే,
సరిచూడబడి
కడప శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు,
ముద్రింపబడియె.
1932 సం.

 [వెల 0-1-0

# శ్రీ రామ చంద్రప్రభవే.

# పీఠిక.

విద్వత్కవిశ్రేష్ఠులారా!

క॥ తంజోర్ఖ్య వంశ జలనిధి
రంగారుచు గంగాధరుడు, రాట్కవిసింహాలుం,
డంగజ జనకుని భక్తుడు
మంగవతీ పుత్రుఁడమిత, మమతదలిర్పన్,

నాకిడ కరుగఁ దెంచినట్టి,

క॥ రసపూరిత కృతిశతికిన్
కుసుగల్గు విశిష్ట నాటకా బోధకళా
లస దంచిత వచనతికిన్
నసమానోన్నతికి వేంకటాచలపతికిన్

నమస్కృతులొనర్చి. తగిన ప్రత్యుత్తరముల సం
తృప్తిఁబొందించి నన్ను నైతిగదా యని సంతసిం
చియున్న నన్నుఁ జూచి,

క॥ నారాయణ కవిరత్నము
పారాముల హృదయము పిదయు, సన్నుత సుగుణా
శ్రీరామనామ పావన
తారకయుత ధన్యచరిత, కావ్యవినోదా

అని సంబోధించి,

క॥ రామార్పణముగ భక్తిఁ
రామామృతరసముఁ జిల్కఁ, రామశతకముల్
సీమావళి వెలయఁగ నా
సోమార్కముగా రచించు, సొంపుగ వత్సా

అని సెలవిచ్చి నిజపురమునకరిగిరి, పిదప ప
ద్యమననద్దిరయో యొకించుకేనియుఁ నెఱుంగని నా
తలపై గురువులవారిడిన భారము నెట్లు నిర్వహిం
తునాయని తలంచి తుదకుఁ దెగువవహించి, భవ
బంధ మోక్షణంబగు, శ్రీ రామ శతకమును ర
చించితిని.

కానవో కవి శిఖామణులారా,

క॥ కృతి పతినని గర్వించను
కృతి మొదటిదిగాన గరుణఁ గృతివర్ధిల్లన్
నతిముదమొదవగ దీవన
లతులితముగ నొసగవలయుఁ నార్యులు మెచ్చన్.

జన్మస్థానము,
లావనూర్.

ఇట్లు,
కవిరత్నం
బి. నారాయణ,
టీచర్, మేనేజర్, హిందూస్కూల్,
కోట్రియం, తిమ్మాపురం.



# శ్రీరామశతకము.

క॥ శ్రీ సీతాపతి రఘువర
కోసలదేశాధినాథ, కోవిదవినుతా
కౌసల్యాత్మజ రామా
భాసుర నవహేమదామ, భార్గవరామా 1

క॥ అమర మునీశ్వరవందిత
కమలాయత పత్రనేత్ర, కాంచనచేలా
కమనీయ రూపసుందర
కమలాధిప సదయ హృదయ, కావుమురామా 2

క॥ అడుకులు పిడికెడు ముడుచుకఁ
గడువడి నడతెంచినట్టి ఘనుని కుచేలున్
బొడగాంచి సత్కరించియు
తడయక భాగ్యంబులిడవె, దశరథరామా 3

క॥ ఆలింపుమయ్య నామొర
చాలించుము పాటమునాదు. సంకటముల ని
ర్మూలింపుము ననుదయఁగని
పాలింపుము సుగుణధామ, పావనరామా 4

క॥ ఇనవంశ చంద్రమునహార
వనజాయత పత్రనేత్ర, వసుదేవసుతా
దనుజాంతక భవహంతక,
జనక సుతాధీశ్వ, జననుత రామా 5

క॥ ఈశుండందరు కొందరు,
కేశవుడని కొందరంద్రు, కొందరు వినులో
శేషుండందురు ధరలో,
కౌశికముని యాగరక్షకా రఘు రామా 6

క॥ ఉరమున లక్ష్మీదేవిని
కరములఁ జక్రంబు శార్ఙ్గ, గదశంఖములున్
శిరమున రత్నకిరీటము,
మెరయగ దాల్చితివి నీవు, మెప్పుగ రామా 7

క॥ ఉంచెద నీపదభక్తిని
పెంచెద నీనామభజన, నెమ్మిని నేనే
వించెదనిమ్ము మనమున పూ
జించెద నిరతంబు సుమ్ము శ్రీరఘు రామా, 8

క॥ ఊరూర మందిరంబుల
నీ రూపపటంబులుంచి, నియమితభక్తిన్
శ్రీరామ రామ యనుచును
సారెకు భజియించుచుంద్రు, సదమల రామా 9

క॥ ఓ తండ్రీ కావఁగదవే
నా తల్లియుఁ దండ్రి, గురువు నాథుఁడవీవే
పాతకుఁడను బోవిడువక
ఖ్యాతిగనన్ గావు ముక్తిఁ, కల్పక రామా 15

క॥ కరివరద శరణు మురహర
సురవరనుత గరుడగమన సురరిపుహరణా
కరుణాకలిర్వగ వేగమె
దరిచేర్పుము నన్ను విడువ ధర్మమె రామా 16

క॥ కలుషంబు లెన్ని జేసితొ
దెలిసియు దెలియక నేను, దేవరయువినీ
తఁ పుననుంచక బ్రోవవె
ఇల నీసరి లేరటంచు నెంచితి రామా 17

క॥ కర్మమున బ్రాణిపుట్టును,
కర్మమునను వృద్ధిగాంచు కర్మమునలయమౌ
కర్మమె కారణ మంతకు
కర్మములే కద్దిగాదు, కద శ్రీరామా 18

క॥ కాకాసుర మదభంజన
లోకాధిప పరమమూని, లోలావిలస
త్సాకేతపు రాధీశ్వర
నీకెవ్వరు సాటిగలరు నిజముగ రామా 19

క॥ కాలము చెల్లక మునుపే కల
కాలమునను నాదుహృదయ, కమలమునందుఁ
జాలఁగఁ దలచుచుఁ నుందును,
కాలుని నా చెంతరాకఁ గాపుము రామా 20

క॥ కించిజ్ఞుండను నగుటచె
ఎంచంగా జాలలేని, యుక్త్యుక్తుల తె
క్షంచక జేసితి నీమది
వుంచక సర్వజ్ఞ ప్రభోవు, మొనరగ రామా 21

క॥ క్రూరుని రావణు దునిమెదు
శూరుడవై నీవు చైత్ర, శుద్ధనవమిలో
ధీరత నుదయంబందిన
శ్రీ రవికులధామ సోమ, సీతారామా 22

క॥ కొండలు కలడందురు నినుఁ
గొండలు లేకంద్రు మరియుఁ గొందరువరుసన్
పొందుగ కలడో లేడో
యందురు సందియమునంది, యవనిజరామా 23

క॥ కోపమున కసరి మరి మరి
శాపమునన్ మాతసుతను, శాఁజూచువరిన్
పాపాత్ముడ నీపుత్రుడఁ
గాపాడుము తండ్రివీవె, కరుణను రామా 23

క॥ గతిలేదు సుతులు లేరని
వెతచే దశరథ విభుండు, వేగిరపడుచున్
సుతయాగ మొకటిం జేయగ
సుతుడవునై బుట్టితీవు, సువ్రతరామా 24

క॥ ఘనుడగు విశ్వామిత్రుని
వెనువెంటను జనుచునుండి, వేడుకతోడన్
దునుమాడితివా తాటకిఁ
గననేర్తురె నీదు మహిమ, కలనైన, రామా 25

క॥ ఘనమారీచ సుబాహుల
ననిలో దోలంగంజేసి, యతిముద మొదవన్
జనుచును రాతిని నాతిగఁ
గనికరమున జేసినావు, కదరఘురామా 26

క॥ చయ్యన మిథిలకు నేగియు
నెయ్యముతో జనకునింట, నేర్పసగందా
లియ్య మొనర్పదలంచితి
వయ్యా కల్యాణరామ, యవ్యయరామా 27

క॥ చాపమ్ముం ద్రుంచియు జనకుని
పాపను గైకొనియు భూమి, పాలకు లెంచెల్లన్
బాపియు కీర్తిని దిశలన్
దీపించియు, వెలసినావు ధీరరామా 28

క॥ చింతిల్లెదు తలిదండ్రుః
చెంతకు సతితోడగూడి చెలగుచు సీతా
కాంతతో చని దండము లిడి
సంతసమొనగూర్చినావు, సన్నుతరామా 29

క॥ చెప్పియు చెప్పక మునుపే
తప్పక మీతండ్రి యాజ్ఞ, దలనిడిమదియే
నొప్పియు లేకను కానల
కప్పుడె భూపుత్రితోడ, నరుగవె రామా 30

క॥ చెట్లును చేమలు గుట్టలు
నట్టడవులుఁ బట్టి చనుచు, నానాశ్రమలన్
నెట్టుసహించితో తెలియదు
కట్టడి కర్మంబుమాన్పఁ గలరా రామా 31

క॥ చేడియయగు దానవునిన్
వాడిశరంబునను ముక్కు, వడిఁగోయించన్
గోడున యేడ్వగ మృగమై
పోడిమిమారీచుడపుడె. పొంచెను రామా 32

క॥ చొక్కపు బంగరు పొడలతోఁ
గ్రక్కునయుప్పర్ణ కాల, కదలియుగంగా
మక్కువతో సీత కోరగఁ
జక్కాడియుఁ దెత్తునమచుఁ జనదవె రామా 33

క॥ చోరత్వంబున సీతను
క్రూరుండై రావణుండు, గొని వసిలంకెన్
జేరఁగ మార్గము లరయఁగ
ధీరత సౌమిత్రితోడఁ దిరుగవె రామా 34

క॥ జగములు వగలచేఁ బొగలఁగ
మిగులఁగ దుఃఖించుచుండ, మిమ్ము జటాయుం
డగు పులుఁగురేఁడు గనుఁగొని
తెగినవిధముఁ జెప్పవినవె, తెంపున రామా 35

క॥ జారిణికులమున వెలసిన
నారియుతశబరియను బోయనారిహృదయమునం
బారఁగ నెంగిలి ఫలములఁ
గూరిమిఁ నొసఁగంగఁ దినవె, కువలయరామా 36

క॥ జీవుఁడె దేవుండందురు
దేవుఁడె మరి జీవుఁడంద్రు, దేశికులెల్లన్
జీవునిఁ గాంచిన వారలు
దేవతలై బరగుచుండ్రు, దివమున రామా 37

క॥ టాటోటుతనమ్మున గిరి
మాటున వెసడాగియున్న మర్కటవిభునిన్
గాటంపు ప్రేమఁ గావఁగ
మీటవె యువ్వాలిశూల, మేదిని రామా 38

క॥ తవశిశుని రాక్షసేంద్రుని
బవరమునఁ జంపదలంచి, ప్లవగులచేతన్
యవనీశసాంద్రమునకుఁ
సవరింపవె సేతువపుడ, సన్నుతరామా 39

క॥ ధాటికి గుండె ఝల్లుమన
నాశాధిపవైరిరావ, ణాసురు శిరముల్
సాకేతపురాధీశ్వర
వీకఁ బస్రవేసు లేద, వెలయఁగ రామా 40

క॥ తట్టుపడియు రాక్షసులను
గట్టడి కపికోట్లఁ బ్రోచి, రాక్షసవిభుఁ జే
పట్టియు సీతను గూడుక
పట్టణమేలితివి పట్టభద్రారామా 41

క॥ తగనిగమ తస్కరుండగు
దగతుని సోమకునిఁజంప, బటుమీనమవై
తెగటార్చి పద్మభవునకు
నిగమంబులు దెచ్చియీవె, నిర్మలరామా 42

క॥ తమవారిఁగూడి అసురులు
నమరాదులుఁ జేరి పాలయబ్ధిని దరువన్
రమణీయమందరాద్రిని
కమఠమవై దాల్చితీవు గదశ్రీరామా 43

క॥ ఆధరణి నాపవిధమున
సాధనమున బట్టికొనుచు, జనుకన కాత్ముఁ
సాధించి సద్వరాహమ
వై ధరణిని నిల్పితివు, వరనుతరామా 44

క॥ తనవైరి దలచుచుండిన
తనసుతు బరిమార్పఁ జెంచి, తానున్నతరిఁ
గని నరహరిరూపంబునఁ
గనలి దునిమితౌర హేమ, కశిపుని రామా 45

క॥ తిరి పెంపువాడవయ్యును
మురియుచు మూడడుగులడిగి, ముల్లోకములఁ
పరిపూర్ణతవెలశితివో
ధరవామనమూర్తివగుచు, దశరథరామా 46

క॥ ధరనిరుపది యొకతేపఁ
దిరుగుచు పరశువుధరించి, ధీరతసోడఁ
ధరణీవాధుల శిరముల
నరుకవె హరిపరశురామ, నరహరిరామా 47

క॥ దశకంఠుని దునుముటకై
దశరథునకు సుతుడవగుచు, ధరనుదయించీ
దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీతఁనేలు, కొంటివిరామా 48

క॥ ధేనుకుడు కంసుఁడాదిగ
దానవులనుఁ ద్రుంచి మురళిఁ దనరఁగ నాలఁగ
గానల మేఁపిన గోపీ
మానసహార దొంగ కృష్ణ, మహీసుత రామా 49

క॥ దైత్యకులేంద్రుల భార్యల
నిత్యము సద్వ్రతము సెఱచు, నయమతిభక్తిఁ
ప్రత్యక్షంబుగఁ గాంచిన
సత్వపుబుద్ధావతార, సద్గుణ రామా 50

క॥ దార్జన్యులైన మ్లేచ్ఛుల
దార్ఢ్యము గాచుటకును, నగ కలికివివై
దుర్జనకుల విధ్వంసక
నిర్జరనుత పుణ్యనాథ, నిజముగ రామా 51

క॥ నరపతులకు పతివాఁడవు
సురపతులకు సురుఁడవాఁడు సుజనవిలోలా
ధరమునులకు మునివాఁడవు
సరియాదురె నీకునరులు, జగతిని రామా 52

క॥ నయమేదో కిరాతకసతి
ప్రియమగునవి తనదునోటఁ, జీకిన ఫలముల్
నయమార మెసవితో భళి
దయయుంచుము దాసుపైన, దశరథరామా 53

క॥ నందుని నందన దశరథ
నందన కశ్యపునినంద, నాజమదగ్ని
నందననుత సనకస
నందన ననుగావుమయ్యా, నయముగ రామా 54

క॥ నయవినయ వివేకంబులు
భయభక్తులుగల్గువారి, బ్రాపగనీదౌ
మయమగు సంపద్వారధి
దయజూపుము సుగుణధామ దశరధరామా 55

క॥ నారాయణ నారాయణ
నారాయణయనుచునాత్మ, నందనుబిలువగ
క్రూరునజామిళుఁ గాచితి
వేరీనీసాటివేల్పు, లెందునురామా 56

క॥ నారాయణ నారాయణ
నారాయణయనుచునాదు నాలుకతోడగ
పారాయణ మొనరించెద
పారామలహృదయకోపు, సదమలరామా 57

క॥ నిలువున ద్రౌపది వలువలు
తులువగు దుర్యోధనాజ్ఞ, దుశ్శాసనుడౌ
న్నొలువగ నప్పుడ యక్షయ
వలువలగ బ్రోచెనొసగ,వారఘురామా 58

క॥ నీ క్షేమఁ బొంది మనుటకు
నా ప్రజ్ఞాకాండగాని, యత్నములు లేరా
నీ ప్రాపు జొచ్చి వేడెద
నీ ప్రాపే ప్రాపునాకు, నిక్కము రామా 64

క॥ నీనామము భవహరణము
నీనామము సకలపాప, నిచయహరంబుల్
నీనామామృతమధురం
బీనామములందుఁ గలదె, యెన్నగ రామా 65

క॥ నీనామముఁ దలచియొకద
యానారదముఖ్యులెల్ల, యతివరులగుటల్
భూనాయక నిను వేడెద
మానాయక ప్రోవవయ్య మహినుత రామా 66

క॥ మారారుల నేనిమ్మని
నోరారఁగ నడుగ లేదు, సుతదశరథా
క్షీరాబ్ధిశయన మరువక
పారాయణ చేతునయ్య, పరహిత రామా 67

క॥ నేనాడు కల్లలెల్లను
భూనాయక శిక్ష చేయ, భువి నన్నోయగుఁ
దీనామమంత్ర పఠనము
నానేరంబులను ద్రుంచు, నరనుత రామా 68

క॥ పరుసముసోకిన నినుముగ౯
కరగియుఁ బంగారమైన, కరణిని మదిని౯
మరుపకఁ దలచినవారలు
సరగున పుణ్యాత్ములౌట, సత్యము రామా 69

క॥ పక్షికి మోక్షము నిస్తివి
రక్షించితివమితకృపను, రావణుఁదమ్ము౯
నీక్షితి నీసరి దైవము
వీక్షింపఁగ నెవరుగలరు, వెన్నుఁడ రామా 70

క॥ పరమాత్మ నీస్వరూపము
పరిసిజగర్భాధిమౌని, సంతతులెల్ల౯
నరయఁగఁజాలరు నామదిఁ
నరయఁగనేనెంతవాఁడ నచ్యుత రామా 71

క॥ పరదారల పరధనముల
మరగియు తల్కాలసౌఖ్య, మహిమకుఁజిక్కి
నరపశువులు భ్రమియింతురు
నరయక పాపంబిదంచు, నతహార రామా 72

క॥ ఫలపుష్పంబులఁ బూజలు
సలుపంగాఁజూతురిలను, సంతసమొదవ౯
ఫలపుష్పంబులు నీవే
సలిపెడిదేమింక సకల, సద్గుణ రామా 73

క। పాలను ముంచిన నీవే
నీళ్ళను ముంచినను నీవె, నిజముగ సీతా
లోలా భజించెద నిరతము
ఏలీలఁ గావగలవో, యినకులరామా 74

క। పాంచాలి మానరక్షణ
సంచయ రిపుహరణ సాధు, సన్నుతచరణా
యొంచెద తారకమంత్రం
బుచితమగు భక్తితోడఁ, సవ్యయ రామా 75

క। పుట్టుట గిట్టుట కొఱకే
గిట్టుట మరి పుట్టుకొఱకె, గిరిధర శౌరీ
పుట్టని గిట్టని మార్గము
గట్టిగ జూపింపు మయ్య, ఘనముగ రామా 76

క। పెద్దల సాంగత్యంబును
పెద్దలసంసేవనంబుఁ, పెద్దలపలుకుల్
తద్దయుఁ గాంచినవారలు
ముద్దుగ మిముగాంతు రయ్య, పరమున రామా 77

క। పోరే శిలపైఁ నెందరో
కారే రాజాధిరాజ, కమలాహితులున్
లేరే క్షత్రప్రభువులు
వారేరీ యిప్పుడున్నవారే రామా 78

క॥ బలవంతుల రక్షింతువు
బలహీనుల శిక్షజేసి బాధింతువుగా
బలవంతుల బలహీనుల
నిలసమముగఁ జూతువంద్రు, నిక్కము రామా 79

క॥ బంధులు భార్యలు బిడ్డలు
బంధంబులెగాక మోక్ష భంగంబులునౌ
సంధనములఁ గాల్చఁ బత్తరి
బంధువులెవరయ్యె వట్టి భ్రమగద రామా 80

క॥ భయపడ నామృత్యువునకు
భయపడ నష్టాదికష్ట బాధలకును నే
భయపడను దుష్టతతికి
భయమయ్యెడు యమునిభటుల భయమో రామా 81

క॥ భోగంబు లనుభవించితి
రాగంబులఁ జిక్కిమిగుల, రాయిడిపడితిన్
వేగించితిఁ గాలంబుల
యోగమునాధించనైతి, నోర్పున రామా 82

క॥ మలమూత్రంబులలోబడి
కలియుచు నవమాసములును గర్భములోనన్
వెలయుచు నిటునుదయించితిఁ
గలనో యిలిమాయయేమొ. కర్మము రామా 83

క॥ మంత్రంబులఁ దంత్రంబులఁ
నంత్రంబులఁ నేమియెూయుగఁ సభవభవానీ
మంత్రము మూర్తుల మూలపు
మంత్రమెయగు జన్మరహిత, మంత్రము

క॥ మేదినియంతయుఁ దిరిగిన [రామా 84
సాదరమునఁ జదువులెన్నోఁ జదివినమరిసం
పాదనగల్గిన ముక్తియు
లేదందురు భక్తిలేక, లేశమురామా 85

క॥ రక్షించుము లోకేశ్వర
రక్షించుమటంచునాత్మ, రక్షణగోరఁ
రక్షించవె కరిఁ నటువలె
రక్షించుము నన్ను, సుజనరక్షకరామా 86

క॥ రాగము రోగముఁ దెచ్చును
రాగము భోగంబుఁ జెఱచు, రంజన జెఱచుఁ
రాగము యోగముఁ జెఱచును
రాగమడచి ప్రోవవయ్య రఘుకులరామా 87

క॥ రాతిని నాతిజేసితివి
కోతులతో జలధిఁగట్టఁ గల్పించితివౌ
ఘాతకి కాటకిఁ జంపితి
వాతతబంసీలిశాలి వౌదువురామా 88

॥ రాయన పాపము వదలును
మాయన మదిజేరనీక, మరలించునురా
మాయను రెండక్షరములు
మాయను మాయింపజేయు, మాధవరామా 89

క॥ రొక్కంబిచ్చిన కుబ్జయు
నిక్కముగా నెద్దియిచ్చె నీకాగజముల్
లెక్కించిచూడ భక్తియు
నొక్కటియే మూలమగుచు, నొప్పునురామా 90

క॥ లోకములన్నియు నిండియు
వైకుంఠమునందు నెపుడు, వాసిగభక్తా
నీకమును గూడి వెలుగగ
శ్రీకంఠావినుతనీకె, చెల్లునురామా 91

క॥ వడుగవునై మూడడుగులు
పుడమిని దానంబుగొనియు, పుణ్యుని బలినిఁ
బడద్రొక్కిన బలశాలివి
వడుగవె త్రైలోక్య సుజన వందితరామా 92

క॥ శక్రాది దివిజసన్నుత
చక్రాయుధ ఖడ్గపాణి, శౌరిమురారి
అక్రూరార్చిత మాధవ
సక్రమముగ నేలునన్ను, సదయుఁడరామా 93

క॥ సనకసనందన వందిత
కనకాంబరచేల భక్త కామితపాలా
దనుజాంతక కవికల్పక
ననుగావుము నతబిడౌజ, నగధరరామా 94

క॥ సంకల్పంబులు నీవే
సంకల్పను మాత్రమిదావి, సత్వంబీవే
సంకల్ప వికల్పంబులు
సంకల్పముఁ జేతువృత్తి, సన్నుతరామా 95

క॥ శరణని విభీషణాదులు
దరిజేరిన నభయమిడవె, దయరంజిలగా
శరణాగత వత్సలుడని
దరిజేరితి నన్నుగావు, దశరథరామా 96

క॥ శ్రీరామరామయనుచును
పారాయణజేసిగాదె ప్రహ్లాదాదుల్
నీరూపుఁ జూడగల్గుట
శ్రీరామారామరామ సీతారామా 97

క॥ శూరుని భీముని గాగను
క్రూరుని యక్రూరుగాను, గుణనిర్గుణుగా
నారకుని బుణ్యుగాఁ జనుఁ
ధీరునిగ నొనర్తు వమల, ధీనిధిరామా 98

